# భీమేశ

## శతకము.



గ్రంథకర్త:

దేవరకొండ అనంతరావు.

శ్రీరామకృష్ణ ప్రింటింగువర్క్సు,
శ్రీకాకుళం.

 వెల రు 0—4—0

ఓమ్

# భీమేశ శతకము



దేవరకొండ అనంతరాయ

విరచితము

శ్రీకాకుళం.

1000 ప్రతులు.



యస్. ఆర్. కె. పి. వర్క్సు,
శ్రీకాకుళం.

1939

 వెల రు 0—4—0

ఓం

# తొలిపలుకు

ఈ భీమేశ శతకము నాయంతేవాసులలో నొకం డగు దేవరకొండ యనంతరాయాఖ్యునిచేఁ గందపద్య ములలో హృద్యముగా రచింపఁబడినది. ఇది యీతని ప్రథమప్రయత్నమగుటంజేసి యందందు లోపములుండ నోపు. దీనిని సాధ్యమగునంతవఱకు సంస్కరించి నాఁడను. "ప్రమాదో ధీమతామపి" యను నార్యోక్తి కలదు. కావుననీశతకమున నింకను నెరసు లున్నచో ధీమంతులు మన్నించి, యిందలి సారమును గ్రహించి యిక్కవి నెల్లవిధములఁ బ్రోత్సహింతురు గాక! భక్తి రసమును సరళ భావములును, శబ్దాలం కారములును, శోభిల్లునటుల నీశతకమును రచించిన యిబ్బాలకవి నబ్బాలచంద్రమౌళి సకల శుభముల నొసంగి సాఁకుఁగాత!

కం॥ స్మరహరుపై శతకము బుధ
వరపరమాదరమునకును పాత్రముగా ని
ర్ధర నొనరిచి నెగడిన దే
వరకొండ యనంతరావు వర్ధిలుగాత॥

ఇట్లు. బొమ్మిడాల ఆదివేఙ్కట నరసింగరావు.
భూగోళశాస్త్రజ్ఞుఁడు, బి. ఎ. బి. ఇ. డి. యచ్ ఎం.డి.
పురపాలక సంఘోన్నత పాఠశాల, శ్రీకాకుళం.
శ్రీకాకుళం. శాలి. శ. ౬ – ౫ – ౧౮౬౧ క్రీశ.
తే 12–5–1939 దీ

# పీఠిక.

శ్రీ భీమేశు ప్రేరణమున నీశతకమును వ్రాయ మొదలిడి తత్కరుణా కటాక్షమున నెట్లో ముగించితిని. ఎక్కుడు భాషాజ్ఞానము, గ్రంథపరిచయము, లేనివాఁడ నగుట నిందనేక లోపములుండనోపు. సరసులగు విద్వజ్జనంబులిందలి నెరసులఁ బాటింపక బాలుఁడనగు నన్నుఁ బ్రోత్సహింప మిక్కిలి ప్రార్థించుచున్నాఁడను.

దీని సవరింపవేడ నట్లొనర్చి, నాపలుకులకలరి 'తొలి పలుకు' ను వ్రాసియిచ్చిన మద్గురువర్యులగు శ్రీ బొమ్మిడాల ఆదివేఙ్కట నరసింగరావు నాయఁడు బి. ఎ. బి. ఇ. డి. హెచ్. యమ్. డి గారికిని, పద్యము లల్లుతరి నన్ను నిచ్చలుఁ బ్రోత్సహించుచుండిన మద్గురుతుల్యులగు గయినేడి నరసింగరావు నాయఁడు గారికిని, నాకృతజ్ఞతాభివందనములు. మఱియు దీనినచ్చొత్తించు సందర్భమున ద్రవ్యాది సహాయముల నొసర్చిన శ్రీ కిల్లాన రామన్నాయఁడు (ప్రొప్రయిటరు యస్. ఆర్. కె పి. వర్క్సు) గారికిని, తదితర భక్తాగ్రేసరులగు మన్మిత్ర మండలికి, నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. వారికి భీమేశుఁ డెల్లవేళల సమస్తైశ్వర్యేప్సిత సిద్ధులఁ బ్రసాదింపఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుఁడు,

దేవరకొండ అనంతరావు

శ్రీకాకుళం.



ఓం.

# భీ మే శ శ త క ము

కం॥ శ్రీకర ! యోసద్భక్త వ
శీకర ! రిపుభీకర ! సురశేఖర ! హర ! మో
క్షాకర ! రజనీకరధర !
శ్రీకంఠా ! తలంతు శ్రీభీమేశా. 1

కం॥ అందములగు కందములను
మందార సుమంబులేరి, మాలగ నత్యా
నందంబునఁ గూర్చితినో
యిందుధరా ! దీనిఁదాల్పుమిఁక భీమేశా. 2

కం॥ దోసఁగులనేకములిందుం
బొసఁగిన భవదీయనామమున్బొగడుటచే
వెసనూహింపరుగద బుధు
లిసుమంతయుఁ గూడదీనినిల భీమేశా. 3

కం॥ భక్తులఁగాచెదవంచు
న్భక్తి విహీనులనుఁగాచు శక్తుఁడవని స
ద్భక్తిని నినుఁగొలిచెదనిఁక
ముక్తిని దయసేయుమో ప్రభూ భీమేశా. 4

కం॥ ఈశా ! గౌరీశా ! వి
శ్వేశా ! రిపునాశ ! సోమహేశా ! పోషా !
యాశా పాశవినాశా !
నాశరహిత ! దయనుగనుమునను భీమేశా. 5

కం॥ బసవన్న నెక్కుడంచుం
దిసమొలవాఁడంచు నిన్నుఁ దిట్టెడువాఁడీ
వసుధనఁ గసవును మెసవెడు
పసరముతో సాటియౌను ప్రభు ! భీమేశా. 6

కం॥ ధరణిరథము, దాసిఁ [illegible] దిన
కర, శశి చక్రములు, మిన్కుగమితురంగంబు,
ధరణీధరమే ధనువును,
హరి నీశర, మజుఁడుసూతుఁడట భీమేశా. 7

కం॥ హర ! శశిధర ! హరిశర ! భూ
ధరధర ! గౌరీవర ! వరదా ! పరమేశా !
సురపర ! స్మరహర ! సుగుణా
కర ! గంగాధర ! గురు శుభకర ! భీమేశా 8

కం॥ శివ! మాధవ ! సరసీరుహ
భవ ! యననొక్కటియుకాదె ? భవభయనాశా
భువనావళిపోషా ! త్రిపు
రవినాశా ! యీశ! మోహరా! భీమేశా. 9

కం॥ నందీశుఁడు, భృంగీశుఁడు
బృందారకు, లజుఁడు, హరియు, ఋషివరులిలనీ
సుందరపద పద్మంబుల
నందము గాఁగొల్వఁ జెలఁగుహర! భీమేశా. 10

కం॥ ఒక్కఁడవటఁ, రక్కసులనుఁ
జెక్కుదువఁట; భక్తతతికిఁ జిక్కుదువఁట, నీ
దిక్కును గోరినవారికి
దక్కుదువఁట, నిక్కమేకదా భీమేశా. 11

కం॥ మృత్యుంజయ ! జితదానవ !
నిత్యుండవు నీవయనుచు నిర్మలమతినో
సత్యస్వరూప ! తలతును
నిత్యంబును నిన్ను మదిని, నే భీమేశా. 12

కం॥ ఒకభక్తుఁడు నీకై తన
సుకుమార కుమారుఁ జంపెఁ జోద్యమకద! వే
ల్పొకఁ డాలిని నీకొసఁగడె
యకలంకా! యోయుమాంక!హర!భీమేశా. 13

కం॥ విలు, కాంచనమేకద ? భూ
మలఁగూర్పఁగ విశ్వకర్మ సన్నిధిలేఁడే ?
యిలఁబాపఁగలఁదాల్పఁగఁ
గలరూపును వేగఁ దెల్పఁ గదె ? భీమేశా. 14

కం॥ ఎందునుఁగలవని జనులను
చుందురుగద, నీదుజాడఁ జూచితిగానీ
సుందరరూపముఁ గనలే
దిందుధరా ! కతముఁదెల్పవే ? భీమేశా. 15

కం॥ శంకర ! యందునో ? భక్తవ
శంకర ! యనిపిలుతు నో ? హర! శశిధర! గౌరీ
శంకర ! మృత్యుభయంకర !
యోంకారాకార ! యందునో? భీమేశా.  16

కం॥ పిలచినఁ బలుకవదేమొకో ?
యలుకానాపై ననర్హుఁడన ? ధూర్తుఁడనా ?
కలుషాత్ముఁడఁనా ? జగతి చ
పలమతినా ? దెల్పి కావవా భీమేశా.  17

కం॥ జయమునొంౘ్బదిన సాపత్రి
భ, యటంచుందలతులేని పట్టుసనీదా
దయలేదందును జడుఁడను
దయతో మన్నించికావు ధర భీమేశా.  18

కం॥ పాపాత్ముఁడనేనైనం
దాపసమందార ! నన్ను దయఁజూడకిటుల్
కోపింపనగున ? తగునా ?
నీపుత్త్రుఁడఁగానటయ్యె నే భీమేశా.  19

కం॥ పలికెడిది నీదునామము
పలికించెడివాఁడవీవు పలుకఁగ పావం
బులు దొలఁగునంట హర ! నీ
పలుకులు సుధలొలుకునఁటయభవ!భీమేశా 20

కం॥ ఒక్కటినేఁ దలఁచిన నీ
వొక్కటిఁజేయంగఁబోదువుచితమ ? నీకో
ముక్కంటీ ! తెలుపుమయా ?
నిక్కముగను వేఁడికొంచునిను భీమేశా. 21

కం॥ ఒకనిముసంబానందం
బొకనిముసము దుఃఖపూచునుండునిలను గా
దొకో ? నీమాయనుఁ గనసా
నొకో ? భువినాబోఁటి వానికో భీమేశా. 22

కం॥ మహామహావారాశి నను
దోఁప్రియఁగలెన్నంచు నీకుఁ దోచెన? ఒకనేఁ
జేయునదెయ్యది ? యెందుం
బోయెద, వెరఁశెద్ది? యోప్రభూ! భీమేశా 23

కం॥ నీపరమభక్తులకు భువి
నాపదలేరావు, గాని యటువచ్చిన చో
నో పశుపతి ! భక్తి నిఁగన
నీపన్నాగముఁ బెంతు నే భీమేశా. 24

కం॥ వినలేదో శో ? నామొఱలను
వినియును రక్షింపకుండ విడిచితివో శో
మన సెట్టులొప్పె ? యిటుఁజే
యను నీకో దీనబంధు ! యజ ! భీమేశా. 25

కం॥ విశ్వేశ ! విశ్వకర్మా !
విశ్వంబర ! విశ్వనాథ ! విశ్వవ్యాపీ !
విశ్వవినాశా ! యీశా !
విశ్వకరా ! కరుణఁబ్రోవవే భీమేశా. 26

కం॥ నీభక్తుల సహవాసము,
నీభజనము, నీదుభక్తి, నీసేవయు, నా
కీభువి దయసేయఁగదే
యో భవనాశా ! యుమేశ ! యో భీమేశా 27

కం॥ కాలుని భటులకుఁజిక్కెడు
కాలంబున నిన్నుఁదల్పఁగలనో లేనో
కాలాంతక ! కాన నిపుడె
నీలీలలఁబొగడుచుండు నే భీమేశా. 28

కం॥ సుగుణుల కాపదలిడుదువు
సుగుణరహితులన్నఁ గరుణఁ జూతువుధర్మం
బగునొకొ ? నీకిది శివ ! యో
జగతీవర ! భక్తపర ! యజా ! భీమేశా, 29

కం॥ ఎట్టులు కాలముఁ గడుపు ద
దెట్టులు సంసారవార్ధినీదుదు నినుఁ జూ
పట్టెడు మంత్రంబెట్టిది ?
గట్టిగనినుఁగొల్చుఁదెల్పఁగదె ? భీమేశా. 30

కం॥ ఎవ్వాఁడు లోకపాలకుఁ
డెవ్వాఁడీశ్వరుఁడు, నభవుఁడెవ్వఁడు శర్వుం
డెవ్వాఁడు, భవ్యచరితుం
డెవ్వండో ? నీవయేకదే భీమేశా. 31

కం॥ జడమతి, నిడుమలఁ దడబడి
కడుపడి, సెడి, నీయడుగులకడఁ, బడ నీవీ
యెడఁజేనిడ, నోమృడ ! యే
యెడ కేగుదు మగుడఁ ? దెల్పుమిక భీమేశా 32

కం॥ కనికరపుంగని వేయగు
దని, కరములమోడ్చి వేఁడ నారసి మొఱలన్
విని, కరముగాచెదవు, విబు
ధనికరము, నినుఁబొగడుఁగదా భీమేశా. 33

కం॥ పరమ మనీశ్వరులెవ్వని
చరణంబులఁగొలుచుచుందురి సతతముభక్తిన్
పరమేశ్వరుఁడెవ్వండగు
కరుణాభూనీవయూహింపగా భీమేశా. 34

కం॥ కలియుగమున నీనామముఁ
దలచినమోక్షంబునిచ్చి తనుపుదు, హాలా
హాలధర ! గౌరీవర ! యో
కలుషవిదూరా! హర! శుభకర ! భీమేశా 35

కం॥ ఎవఁడీభవసాగరమును
శివనామంబనెడి నావచే దరిఁజేరన్
భువినాశించునొ వాఁడే
భవనాశా ! పొందుముక్తి వరభీమేశా. 36

కం॥ శివ! శివ! యని మదిఁదలచిన
భవబంధములెల్ల వేగఁ బాయునుగాదే
భవనాశా ! రోగ యాశా !
ధవళేశా ! దాసపోష ! ధర భీమేశా. 37

కం॥ ధన, పుత్ర, మిత్ర, బంధులఁ
గని, నిత్యమిదేయటంచుఁ గాసంత నినుం
గనలేక, పాపకూపము
ననుఁబడి, పరిజమ్రగ్గఁ గూడునాభీమేశా. 38

కం॥ అంతకునడచితివని, యా
ద్యంతములిల లేనివాఁడవని, నిచ్చలు నే
నెంతయు వేడంగ, దయ ర
వంతైననుఁ జూపవేమయా ? భీమేశా. 39

కం॥ చదువులు వేయిలఁ జదివిన
మదనహరా ! యెందుఁబనికిమాలిన వేయాఁ
గదనినుఁ దెలిసికొననియా
చదువులు వృధకావె? యోయచల! భీమేశా 40

కం॥ శిరమునఁ జందురుఁ, దురమునఁ
గరమొప్పఁగ విషధరములుఁ, గటిగజచర్మాం
బరమునుఁ, గేలఁ దిశూలము
ధరియించిన నిన్నుఁదలతు ధరభీమేశా. 41

కం॥ పంచాక్షరి జపియించిన
నంచితముగఁ గాలుని భయమదియెటుకల్గున్
పంచశరగర్వ హర ! హర !
పంచానన ! వరద ! భక్త పర ! భీమేశా. 42

కం॥ ధనమును నాకిమ్మని యో
ధనదసఖా ! వేడలేదు, ధరమోక్షాపే
క్షను, నీ సుచరణపద్మము
లనవరతముఁ గొల్చుచుంటినయ భీమేశా. 43

క॥ ఈభువిభస్మముఁ దాల్చిన
నోభవహర ! దోషరాజి యుండును ? పరమే
శా! భువనపోష ! యీశా !
యోభక్త జనాళితోష ! యోభీమేశా ! 44

క॥ చీమలు(బాఁకెడు రొదవిను
దీమహీయన నామొఱ, నది యేలఁ వినవో
కామితజన కల్పద్రుమ !
మామకదురితాలవిత్రమా ! భీమేశా. 45

క॥ ధనదుఁడు సఖుఁడై యుండం
గను, యాచనఁజేయనేలఁ గరుణాశరధీ !
మనమున సందేహము ? మి
త్రునియదుగంగా, సుజనహితుఁడ! భీమేశా 46

క॥ ధవళము గృహమును భూషలు,
ధవళము నీ జడనుగల సుధాకరుఁడరయన్
ధవళము నీదుశరీరము,
ధవళేశా ! యెల్లుకాంతు ? ధర భీమేశా 47

కం॥ హారుఁడొక్కఁడె దైవంబని
ధరవాక్కైరిం,ఢఁడాండ, డాండ నినదముల్
పురిఁగొన, హర ! హర ! శంభో !
వరదా ! యని చాటెదనుశివా ! భీమేశా 48

కం॥ నీవేయంతయు, నంతయు
నీవే, భువివేరులేదు, నిక్కముశివ ! యో
భావాతీతా ! పాగఁజగ
నావశమా, భువనపోషణా ! భీమేశా, 49

కం॥ దుర్గాధినాథ ! యరిష
డ్వర్గమునంఁకిక్కొంటి, వాసిగనన్నే
మార్గమునఁగాచెదో యో
భర్గా ! స్వర్గీయవినుత ! వరభీమేశా. 50

కం॥ రమ్మా ! క్రమ్మర, నేఁ, ను
రమ్మా నఁగమొక్కుచుంటి, రావేలను, నే
రమ్మా ! యిదినాగ్రహ చా
రమ్మా ! గజచర్మధర ! హరా ! భీమేశా 51

కం॥ నీవేమాతవు, జనకుఁడ
నీవే నాబంధుజనుఁడ నీవే, సర్వం
బీవే, లోకేశుండవు
గావే, యో దీనరక్షకా భీమేశా. 60

కం॥ హరి హరులననొక్కటియే
ధరమిమ్ముల భేదబుద్ధిఁదలచినవాఁడో
కరుణామయ కాలునికడ
కరుగుట తథ్యంబయానుఁగదె ? భీమేశా 61

కం॥ కరివరదుండాహరికద,
కరివరమును దీర్పవల్వఁగాఁగట్టితివీ
వరయఁగ గజచర్మంబిక
హరిహరులనవేఱదెట్టులగు భీమేశా. 62

కం॥ బలిగిముఁ గాచెనాహరి
యిల, నోహర ! నీవ్రబాణునిలుఁగాచితిగా
తలపగ భేదంబేలను
కలుగును, మీయిరువురకనుఁగదె భీమేశా 63

కం॥ నరసఖుఁడా శ్రీహరి, దయ
నరునకుఁ బాశుపతమిచ్చినావీవును, మీ
కరయఁగ భేదమ దేఁటికి
ధరఁగల్గును శంకర ! వరదా ! భీమేశా 64

కం॥ యాచకుఁడవీవు, హరియును
యాచకుఁడై త్రిపదములను యాచించెఁగదా
యోచన లేఁటికి భేదము
దోఁచదు మీకెందు బొడ్డదొర ! భీమేశా 65

కం॥ పన్నగములు నీభూషలు
పన్నగ తల్పుండు హరియుఁ బాపవినాశా !
యెన్నఁగ హరియున్నను హరుఁ
డన్నను భేదంబు లేదయా భీమేశా 66

కం॥ మురహరుఁడాతఁడు, నీవో
పురహరుఁడవు సర్వలోకపూజ్యా ! భువిపై
హరియన, హరుఁడన నొకటియ
శరణాగతరక్షణ ! గిరిశా ! భీమేశా 67

క॥ శ్రీగళుఁడవీవు హరియును
శ్రీగలవాఁడెన్నమీకు శివ ! భేదంబే
లాగుంగల్గును ? భవహర !
వాగీశాద్యమరవినుత ! వర భీమేశా 68

క॥ లీలావినోదుఁడవు, హరి
లీలామానుషుఁడు గాదె ? లేశంబును మీ
కాలోచింపఁగభేదం
బేలాగల్గున్మహేశ ! హే భీమేశా 69

క॥ హరిమనికిపట్టు తిరుపతి
గిరి, నీవగుయున్కి రజతగిరి, యిర్వురికిన్
గిరులే నెలవులు, భేదం
బరయుము మీకెందు జూడనరుఁ భీమేశా 70

క॥ దుష్టులశిక్షించును హరి
దుష్టులయుక్కడతువీవు దురమున, మీలో
శిష్టచరిత ! యొకటికదే
కష్టహర ! యభీష్టదాయకా ! భీమేశా 71

కం॥ సారంగపుటెంగిలగుట
సారసమును బూజఁజేయఁజాల నిలనుఁనీ
కారయ మన్మానదయమనెడు
సారసమిదె పూజఁగొనుమచల భీమేశా 72

కం॥ గట్టులరాయని ముద్దుల
పట్టినిఁజేపట్టినట్టి షణ్ముఖుఁ, ధరం
బుట్టటఁగిట్టుట లెరుఁగని
జెట్టిని, నినుఁదలతు నెపుడు శ్రీభీమేశా 73

కం॥ లింగా! యాగవిభంగా!
యంగజహర! సాంబశివ! శుభాంగ! మహేశా!
మంగళకర! గంగాధర!
సంగర భీమా! రమేశశర! భీమేశా 74

కం॥ దినకర శశి శిఖినేత్రా!
ఘనకలుషలతాలవిత్ర! కామితగాత్రా!
మునిజననుత చారిత్రా!
యనుపమ ధీనాళిమిత్ర! హర! భీమేశా 75

కం॥ ఒకరాజు కళంకుఁడు, వే
ఱొకఁడిల వేకన్నులాఁడు, రోషింపఁగ నిం
కొకరాజో గ్రహ బాధితుఁ
డీఁకరాజసనీవకాదె యిల భీమేశా 76

కం॥ శివుఁడవు సర్వభువన ధవుఁ
డవు కమలభవాది సేవ్యుఁడవు నిటలాక్షుం
డవు శంభుండవు, జితమరుఁ
డవు హరుఁడవు, భక్తపోషుఁడవు భీమేశా 77

కం॥ ఆమార్కండేయుడు నీ
కేమిచ్చెను జమునిఁగూల్చి యిలఁగాచితి, నే
నేమపచారముసేసితిఁ
గామితమందార ! దెల్పఁగదె ? భీమేశా 78

కం॥ చిత్తాశ్వమిచ్చవచ్చిన
చిత్తంబుననేగుచుండెఁ జిత్తజహర ! నీ
విత్తఱి నధిరోహింపవె
యుత్తమమార్గంబుఁజూప నో భీమేశా 79

కం॥ రారా ! రాకేందుధరా !
రారా ! రుద్రాక్షహార ! రజితాకారా !
రారా ! రణభీమా ! హర !
రారా ! దుర్గామనోహరా ! భీమేశా 80

కం॥ నతిఁగొనుమా నుతనామా !
యతివరకామా ! సుధామ ! యగణితనామా!
గతినీవే రిపుభీమా !
పతితోద్ధారా ! విరామ ! వరభీమేశా 81

కం॥ నీనామ సుధాపానము
మానను, దిరుగాడుమనుపమానంబగునా
మానససరోవరంబున
మానకనోరాజహంసమా భీమేశా 82

కం॥ తండ్రివిలోకములకు నా
యుండ్రిద్దిండీనికనుచు నోపరమేశా
యందు జనంబులుగద, నా
తండ్రీ! హర! త్ర్యక్షత్రిపుండ్రధర! భీమేశా 83

కం॥ రుద్రా ! దయాసముద్రా !
సద్రూపా ! దక్షశిక్ష ! సజ్జనపక్షా !
రుద్రాక్షధరా ! హర ! యీ
భద్రచరిత ! కావఁగదవె వర భీమేశా 84

కం॥ ఒంటరివో ? లేరొక్కో యే
రింటఁ, న్నీయున్కిఁ జెప్ప మేయదియో, ము
క్కంటీ ! యేమనిపిలచిన
వెంటన పల్కెదవు దెల్పవే ? భీమేశా 85

కం॥ మానసకాంతారంబేఁ
దానకముఁగఁగ్రోధమాది దారుణమృగముల్
కానఁగనగు, నాదికిరా
తానీవిల వానిదునుము దయ భీమేశా 86

కం॥ కాలాంతకా ! మహేశా !
ఫాలాక్షా ! భక్తవాస ! పాపవినాశా !
లీలామానుష వేషా !
కైలాసావాస ! పోషకా ! భీమేశా 87

క॥ ఘనతాపస వినుతా ! విష
మును దాఁ్రివితివంట సురలు మునుబ్రా(ర్థింపం
గను, తావకమహిమలు బొఁగ
డను తరమా ! దీనబంధుఁడా ! భీమేశా 88

క॥ రావా ! నను(గాపాడఁగ
దేవా ! నా మొఱలువినఁగదే, యీశుండా
గావా ! యింతటికఠినమ
బోవా ! శ్రీకంఠ రూపభ్రా ! భీమేశా 89

క॥ నీదయచే భవసాగర
మీఁదఁగఁదగుఁ గొండఁబిండియేఁ జేయనగుం
గాదో కౌ నృత్యాసనోదా !
యో దీనజనాప్తమిత్ర ! యో భీమేశా 90

క॥ పుట్టుటఁ గిట్టుటఁ గనియును
జట్టలనెచ్చెలులఁజూచుచునుఁ బొంగుదు నీ
కట్టెయ శాశ్వతమని, న
న్నెట్టులు రక్షించెదవో యిల భీమేశా 91

క॥ నీలీలలఁగనుఁగొనఁగా
నీలగళా ! నరుఁడఁగాను, నేతిన్నఁడఁగా
నేలీలనేతెదో నను
పాలాక్షా ! హర ! సుభక్తవర ! భీమేశా 92

క॥ శీకరములు సుగుణాళికి,
భీకరములు దైత్యతతికి, వీనులవిన మో
హాకరములు, భక్తులకు వ
శీకరములు, నీచరితలు శ్రీ భీమేశా 93

క॥ శూలివి, గిరిజాసతికను
కూలివి, శశిమాళి, వసురకుంజరతతి ని
ర్మూలివి, కడుబలశాలివి
పాలితలోకాళి, వరయ ప్రభు ! భీమేశా 94

క॥ మారవిదారివి ! దైత్య ప్ర
హారివి ! త్రిపురారి ! వురగ హారి ! వలనురా
ధారివి ! కాకోలవిషా
హారివి ! జడదారి ! విలను హర ! భీమేశా 95

కII తోలునుదాల్చితివీవా
కూళజలంధరునినేలఁ గూల్చితి త్రుటిలో
కాలునిగెల్చితివాసిరి
యాళుని దయఁగాచితివయా ! భీమేశా 96

కంII మాటికిఁ బిల్వంగఁ బలుక
వేటికి, నాపై నిక్కఁ డేటికి, చోటి
ప్పాటికి నీయనిచో, సుర
కోటినిఁగాచినది కల్ల, గురు ! భీమేశా 97

కంII రక్షింప, కటాక్షింపను
శిక్షింపను నీవయాట శ్రితమందారా !
దక్ష విపక్షా ! యాప
ద్రక్షా! యీ కృతినిఁగొనుహరా! భీమేశా 98

కంII శ్రీవిశ్వకర్మకులజుఁడ
దేవరకొండాన్వయుఁడను ధీమతచరితా !
శ్రీవిశ్వభద్రగోత్రుఁడఁ
బ్రోవుమనంతాఖ్యునన్ను భువి భీమేశా 99

క॥ మంగళమిదే గొనుమో శివ
మంగళకర! యో! శుభాంగ! మాధవహిత!నా
మంగళమిదే గైకొను మో
యంగజహర!భృంగివినుత! హర!భీమేశా. 100

సం పూ ర్ణ ము.



శ్రీ రామ కృష్ణ ప్రింటింగువర్క్సు, శ్రీకాకుళం.